జ్ఞాన యోగం

# ఆత్మ సాక్షాత్కారము



ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్
www.freegurukul.org

## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని శ్రీ విద్యా సారధి వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) శ్రీ విద్యా సారధి వారి వెబ్ సైట్: http://srividyasaradhi.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో శ్రీ విద్యా సారధి వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

శ్రీ విద్యా సారధి వారి వెబ్ సైట్:

**http://srividyasaradhi.org/**

Home

srividyasaradhi.org/index.html

శ్రీవిద్యాసారధి

Home | Records_Honors | Gallery | PDF Books | Mantralu

लोकः समस्तसुखिनोभवन्तु

ॐ

Brahmasri
Dr. Krovi Parthasarathi

## About Dr. Krovi Parthasarathi

Brahmasri Dr. Krovi Parthasarathi was born in 13-12-1949 in a Brahmin family in Machilipatnam to Smt. Satya Parvatha Vardhanamma and Sri Krishna Murthy. He was educated in Machilipatnam and started his profession as Lecturer in Commerce in Satavahana Kalasala in Vijayawada He was married to Smt. Rama Devi in the year 1977 and was blessed with two daughters and one son.

He is an eminent scholar and was retired as Reader in Commerce from Satavahana Kalasala, Vijayawada.

Throughout his career he accumulated so many accolades, viz., World Records, National Records and several other honours. He has as much as 32 devotional books written in Telugu. Apart from these, he also gave away discourses on 73 different religious topics that counts more than 1562 hours. His enormous religious contribution in these forms had gather mass and paid special honours from different Government and Religious personalities. He was honoured with many titles, such as: Chakravida, Srividya, Ratnakara, Srivdya Visarada and Srividyanidhi

Although he could have made handsome money out of these, but he never compromised for any sake and did all the work for public service.

This web site is also dedicated as one of his public contributions of all his works like, books in PDF format, Discourses in Videos, and Audio in MP3 format.

Visitors can freely download any form of these available materials to enrich their knowledge and put in the practice for their day to day life.

You may contact us for any clarifications in terms of religious matter or web site specific to the following email ID: info@vidyasarathi.org

## TITLES

*Chakravida,*
*Srividya Ratnakara,*
*Srivdya Visarada*
*and Srividyanidhi*

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆత్మసాక్షాత్కారము



మైసూరు అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ తారణనామ సంవత్సర ఉగాది పురస్కార గ్రహీత,
ఉత్తమ ఉపాధ్యాయ, కనకాభిషేక గ్రహీత, గండపెండేర సన్మానిత,
సువర్ణఘంటాకంకణ, చక్రవిద, శ్రీవిద్యానిధి, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యా విశారద

**డా॥ క్రోవి పార్థసారథి**

**(పరమానందనాథ)**

**ఆత్మసాక్షాత్కారము**

*గ్రంథకర్త :*
**డా॥ క్రోవి పార్థసారథి (పరమానందనాథ)**
రీడర్ ఇన్ కామర్స్
శాతవాహన కళాశాల, విజయవాడ.

ప్రథమ ముద్రణ : జులై, 2005

ప్రతులు : 1000



వెల : రూ. **50-00**

*ప్రాప్తి స్థానములు :*
**కె. మంజూష**
23-11/1-10/2, దేవీ నిలయం
ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011.
ఫోన్ : 0866-2530672
సెల్ : 98497 85031

**శివకామేశ్వరి గ్రంథమాల**
41-22/4-36, భ్రమరాంబాపురం,
కృష్ణలంక, విజయవాడ - 13.
ఫోన్ : 0866-2522824

*ముద్రణ :*
**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
26-6-3, పాపయ్య వీధి, గాంధీనగర్,
విజయవాడ-3. ఫోన్ : 0866 - 2574828

# ప్రణతులు

'జ్ఞానాదేవతుకైవల్యం' జ్ఞానియైన వాడికి మాత్రమే మోక్షం సిద్ధిస్తుంది. భక్తి, యోగము అనేవి కూడా మోక్షానికి మార్గాలే. అయినప్పటికీ అందులో కూడా జ్ఞానానిదే ముఖ్యమైన పాత్ర అని చెబుతున్నాయి ఉపనిషత్తులు. అజ్ఞానానికి మూలమైనది మనస్సు. కాబట్టి ఆ మనసును నశింప చేయటమే అమనస్కయోగము. మనసును నశింపచేసినవాడే జ్ఞాని. అతడికే ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. అతడే జీవన్ముక్తుడు. మహాజ్ఞాని. అటువంటివాడు ఈ దేహాన్ని విడిచిన తరువాత అర్చిరాది మార్గంగుండా బ్రహ్మలోకం చేరి, కల్పాంతాన పరబ్రహ్మలో లీనమవుతాడు.

ఈ విషయాలు అందరికీ తెలియాలనే ఉద్దేశ్యంతోనే జీవి ఈ లోకంలో పుట్టటం దగ్గరనుంచీ, మోక్షం పొందేదాకా ఇందులో వివరించబడింది. అసలు పరబ్రహ్మ స్థూలశరీరాన్ని ఏ రకంగా పొందాడు? జ్ఞాని అంటే ఎవరు ? అతని కర్మ, స్థితి, ఏమిటి ? అవధూత ఎవరు ? పరమహంస ఎవరు ? మహావాక్యాల అర్థం ఏమిటి ? వాటి అనుసంధానం ఏమిటి ? ఆత్మసాక్షాత్కారం అంటే ఏమిటి ? అది ఎలా సిద్ధిస్తుంది ? ఎవరికి సిద్ధిస్తుంది ? ఇత్యాది విషయాలను పూర్తిగా ఉపనిషత్తుల ఆధారంగా ఈ గ్రంథంలో వివరించటం జరిగింది. ఉపనిషత్తులలో వేదాంతాన్ని గురించి వివరించేవి 24. వాటి ఆధారంగానే ఈ గ్రంథరచన చెయ్యటం జరిగింది.

ఈ గ్రంథ రచనలో నన్ను అన్నివిధాలా ప్రోత్సహించిన నా భార్య రమాదేవికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణకు అన్నివిధాల ప్రోత్సహించిన శ్రీ వేమూరి వెంకట గాయత్రీరత్న ప్రసాద్ రిటైర్డు డిప్యూటీ జనరల్ మేనేజర్, మహానగర్ టెలిఫోన్ నిగమ్, ముంబై (ఆత్మానందనాథ) వారికి ప్రత్యేకాభినందనలు.

శ్రీ వి.వి.జి. ప్రసాద్‌గారికి ఆయన ధర్మపత్ని లక్ష్మిగారికి, వారి కుటుంబ సభ్యులకు ఆయురారోగ్య ఐశ్వర్యాలను, మనశ్శాంతిని కలుగజెయ్యాలని ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను.

నేను పండితుణ్ణి కాను, తత్త్వవేత్తను అంతకన్నా కాను. అయినప్పటికీ ఆధ్యాత్మిక చింతనాపరులకు అందుబాటులో ఉండటం కోసం ఈ గ్రంథం వ్రాయటానికి సాహసించాను. ఆధ్యాత్మికవేత్తలు నా యీ సాహసాన్ని మన్నించి నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తాను.

గతంలో వ్రాసిన గ్రంథాలలాగానే ఈ గ్రంథాన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ...

బుధజనవిధేయుడు

**క్రోవి పార్థసారథి**

**(పరమానందనాథ)**

పార్థివనామ సంవత్సర
చైత్రశుద్ధ పూర్ణిమ, భానువారం
24-4-2005

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | ప్రస్థావన | 19 |
| 2. | సృష్టి | 20 |
| 3. | శరీర విజ్ఞానము | 34 |
| 4. | పూర్వజన్మ జ్ఞానము | 43 |
| 5. | పరబ్రహ్మ - స్థూలశరీరము | 46 |
| 6. | మాయాస్వరూపము | 49 |
| 7. | శిష్యుల ప్రశ్నలు | 52 |
| 8. | బ్రాహ్మణుడు ఎవరు ? | 63 |
| 9. | బాహ్యాత్మ, అంతరాత్మ, పరమాత్మ | 66 |
| 10. | అజ్ఞానభూమికలు, జ్ఞానభూమికలు | 69 |
| 11. | జీవన్ముక్తి, విదేహముక్తి | 76 |
| 12. | జ్ఞానియొక్క కర్మ, స్థితి | 79 |
| 13. | శిఖాయజ్ఞోపవీతాలు | 82 |
| 14. | పరమహంస | 86 |
| 15. | అవధూత | 89 |
| 16. | అంతర్యామి | 92 |
| 17. | బ్రహ్మవేత్త | 96 |
| 18. | అర్చిరాది మార్గము | 98 |
| 19. | మహావాక్య వివరణ | 103 |
| 20. | మహావాక్యానుసంధానము | 109 |
| 21. | అఖండైకరస చిన్మాత్ర స్వరూపము | 115 |
| 22. | ఆత్మసాక్షాత్కారము | 117 |
| 23. | ఆత్మానుభవము | 127 |
| 24. | సాయుజ్యము | 130 |


## ఇందులో ఉటంకించిన ఉపనిషత్తులు

1. గర్భోపనిషత్తు
2. శారీరకోపనిషత్తు
3. మైత్రాయణ్యుపనిషత్తు
4. సుబాలోపనిషత్తు
5. మంత్రికోపనిషత్తు
6. సర్వసారోపనిషత్తు
7. నిరాలంబోపనిషత్తు
8. శుకరహస్యోపనిషత్తు
9. వజ్రశూచికోపనిషత్తు
10. ఆత్మబోధోపనిషత్తు
11. స్కందోపనిషత్తు
12. పైంగలోపనిషత్తు
13. మహోపనిషత్తు
14. అధ్యాత్మోపనిషత్తు
15. ఆత్మోపనిషత్తు
16. ముక్తికోపనిషత్తు
17. పరమహంసోపనిషత్తు
18. అవధూతోపనిషత్తు
19. బృహదారణ్యకోపనిషత్తు
20. ఐతరేయోపనిషత్తు
21. ఛాందోగ్యోపనిషత్తు
22. కైవల్యోపనిషత్తు
23. మహావాక్యోపనిషత్తు
24. అధర్వశిరోపనిషత్తు
25. బహ్వృచోపనిషత్తు
26. లలితారహస్యోపనిషత్తు
27. తేజోబిందూపనిషత్తు
28. సన్న్యాసోపనిషత్తు



## డా॥ క్రోవి పార్థసారథి గారి ఇతర గ్రంథాలు

1. శ్రీవిద్యాసారథి (లలితా సహస్రనామ భాష్యము) 1004 పేజీలు
2. శ్రీకైవల్యసారథి (విష్ణు సహస్రనామ భాష్యము) 1288 పేజీలు
3. శ్రీవిద్యా దర్పణము (గౌడపాదుల సుభగోదయస్తుతికి వ్యాఖ్య)
4. శ్రీవిద్యా సర్వస్వము (కామకలావిలాసానికి వ్యాఖ్య)
5. శ్రీవిద్యా హృదయము (యోగినీ హృదయానికి వ్యాఖ్య)
6. శ్రీవిద్యా పంచదశి (పంచదశీ మహామంత్రానికి వివరణ)
7. శ్రీవిద్యా రహస్యము
8. శ్రీవిద్యా మహాయంత్రము (శ్రీచక్రానికి విశేష వ్యాఖ్య)
9. సప్తశతి భాష్యము (చండీ సప్తశతికి భాష్యము)
10. దేవీ కథాసుధ
11. శ్రీవిద్యా దర్శనము
12. ఉపనిషత్సర్వస్వము (దశోపనిషత్తులు వచన రూపంలో)
13. శ్రీచక్ర సర్వస్వము
14. భావనోపనిషత్తు
15. త్రిపురా రహస్యదీపిక
16. బ్రహ్మసూత్రమంజరి
17. శ్రీచక్రము
18. తొలి ఏకాదశి
19. లలితారహస్యోపనిషత్తు
20. ఆత్మసాక్షాత్కారము
21. ఉపనిషద్దర్శనము (దశోపనిషత్తులపై M.P.-3 CD)
22. శ్రీవిద్యా దర్శనము (M.P.-3 CD)
23. శ్రీవిద్యాసారథి (లలితా సహస్రనామ భాష్యము) M.P.-3 ఆడియో సి.డి.లు-2 (24 గం॥లు)
24. సప్తశతి భాష్యము M.P.-3 ఆడియో సి.డి
25. లలితా రహస్యోపనిషత్తు సి.డి.

**సత్కారాలు :**

1. 29-05-2005న మైసూరు అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియామకము.
2. 21-03-2004న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వముచే ఉగాది పురస్కారము.
3. 05-09-2004న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వముచే ఉత్తమ ఉపాధ్యాయ సత్కారము.
4. 15-08-2004న కృష్ణాజిల్లా కలెక్టర్ వారిచే సన్మానము
5. 05-02-2002న శాతవాహన కళాశాల త్రిదశాబ్ది వేడుకలలో కళాశాల యాజమాన్యము వారిచే రజతపతక ప్రదానము.
6. 23-02-2005న శాతవాహన కళాశాల 34వ వార్షికోత్సవాల సందర్భంగా ఉత్తమ ఉపాధ్యాయునిగా సన్మానము.
7. 28-01-2004న శాతవాహన కళాశాల సెక్రటరీ శ్రీ అండవిల్లి సత్యనారాయణ గారిచే రూ. 500/-ల నగదు ప్రదానము.
8. 13-12-1999న కనకాభిషేకము.
9. 01-08-1998న సువర్ణఘంటాకంకణ ప్రదానము.
10. 03-11-2002న గండపెండేర ప్రదానము
11. 11-01-2004న అవధూత, దత్తపీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారిచే నవరత్నాంగుళీయ ప్రదానము

**బిరుదులు :**

1. చక్రవిద, శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద, శ్రీవిద్యానిధి, ఉత్తమ ఉపాధ్యాయ, ఉపాధ్యాయరత్న, విద్యార్థిబంధు.

# 1. ప్రస్థావన

“నమస్కారం గురువుగారూ !”

రెండు గొంతులు ఒక్కసారి పలికేటప్పటికి కళ్ళు తెరిచి చూశాడు అప్పుడే ధ్యానంలో నుంచి లేచిన రత్నాకరుడు. ఎదురుగా తనశిష్యులు కృష్ణశర్మ, నారాయణభట్టు నమస్కరిస్తూ నుంచుని ఉన్నారు. చాలాకాలం తరువాత కనిపించిన శిష్యులను వాత్సల్యంతో పలకరించాడు రత్నాకరుడు. కుశల ప్రశ్నలు పూర్తయినాయి. శిష్యులిద్దరూ గురుదేవుని పాదాల దగ్గర ఆశీనులైనారు. కొంతసేపటికి వచ్చిన పని ఏమిటి ? అని అడిగాడు రత్నాకరుడు.

గురుదేవా ! మీ దగ్గర మేము అనేక విషయాలను తెలుసుకున్నాము. యోగినీ హృదయము, కామకలా విలాసము, సుభగోదయస్తుతి వంటి శ్రీవిద్యా సంబంధమైన గ్రంథాలకు వ్యాఖ్య, శ్రీచక్రము, పంచదశీ మహామంత్రము వంటి మంత్రశాస్త్రాలు. లలితా సహస్ర నామాలకు, విష్ణు సహస్రనామాలకు, దేవీ సప్తశతికి భాష్యము, దేవీ భాగవతము, శివపురాణమువంటి గ్రంథాలు, దశోపనిషత్తులు కూడా కూలంకషంగా చెప్పుకున్నాము. అంతేకాదు దశోపనిషత్తులమీద 12 గం॥ పాటు సి.డి.గా ఇచ్చిన మీ ప్రవచనాలను ప్రతిరోజూ వింటూ ఉంటాము. లలితా సహస్ర నామాలకు భాష్యాన్ని 24 గంటలపాటు ప్రవచనాలు చెప్పి, వాటిని సి.డిలుగా అందించిన మీ ప్రక్రియ మహాద్భుతమైనది. తెలుగువారికి మీరు చేసిన మహోపకారమది. మీరు అంతటి మహానుభావులు. అటువంటి మీరు గతంలో అనేకసార్లు “ఆత్మసాక్షాత్కారము పొందినవాడికి కైవల్యము ప్రాప్తిస్తుంది.” అని చెప్పారు. ఇప్పుడు మేము **ఆత్మసాక్షాత్కారాన్ని** గురించి తెలుసుకోవటానికి మీ దగ్గరకు వచ్చాము” అన్నారు.

ఆ మాటలు విన్న రత్నాకరుడు చిరునవ్వుతో తలపైకెత్తి వారి కళ్ళలోకి సూటిగా చూస్తూ, “నాయనలారా ! ఇప్పటికైనా మీకు ఆ కోరిక కలిగినందుకు చాలా సంతోషంగా ఉంది. మీ కోరిక తప్పక తీరుస్తాను.

వేదాలలో ఆఖరి భాగము ఉపనిషత్తు. నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వీటిలో 108 ఉపనిషత్తులు ముఖ్యమైనవి. వాటిలో వేదాంతోపనిషత్తులు 24. ప్రతి ఉపనిషత్తులోనూ పరమేశ్వర తత్త్వమే చెప్పినప్పటికీ, వేదాంతోపనిషత్తులు పూర్తిగా పరబ్రహ్మతత్త్వాన్ని, ఆత్మసాక్షాత్కారాన్ని వివరించాయి. అందుచేత వేదాంతోపనిషత్తుల ఆధారంగా మీకు ఆత్మసాక్షాత్కారాన్ని వివరిస్తాను" అంటూ చెప్పటం మొదలుపెట్టాడు.

ముందుగా నా గురుదేవులు విరజానంద, సదానంద, శుకానంద నాథులకు నమస్కరించి, ధర్మసంస్థాపన కోసం ఏర్పాటు చేయబడ్డ శృంగేరీ, పూరి, బదరీ, ద్వారకా పీఠాధిపతులకు సాష్టాంగ ప్రణామాలర్పించి, పుష్పగిరి, కుర్తాళం పీఠాధిపతులకు వందనాలర్పించి, గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులకు, గుంటూరు శ్రీవిరూపాక్ష పీఠాధిపతులకు నమోవాకములర్పించి, అవధూత దత్తపీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి నమస్కరించి, పెదపులిపాక లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరిస్వామి వారికి, మాతా శివచైతన్యవారికి వందనాలర్పించి **పరమానందనాథ** దీక్షానామం గల హరితస గోత్రీకుడనైన **క్రోవి పార్థసారథి** అను నేను **"ఆత్మసాక్షాత్కారము"** అనే ఈ గ్రంథాన్ని సులభశైలిలో వ్రాసి అవధూత, దత్తపీఠాధిపతి **శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి అంకితం చేస్తున్నాను.** పండితులు, ముముక్షువులు నా ఈ సాహసాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురుగాక.

## 2. సృష్టి

**(నారాయణోపనిషత్తు, అధర్వశిరోపనిషత్తు, లలితారహస్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు, సుబాలోపనిషత్తు, మహోపనిషత్తు, ఐతరేయోపనిషత్తు, పైంగలోపనిషత్తు, పురుషసూక్తము)**

"గురువుగారూ ! అసలు ఈ జగత్తులో సృష్టి ఎలా జరిగిందో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. ఆ మాటలు విన్న రత్నాకరుడు కొద్దిసేపు మౌనం వహించి తరువాత చెప్పటం ప్రారంభించాడు.

జగత్తులో సృష్టి ఎలా జరిగింది ? అనే విషయం మీద భిన్నమైన వాదనలు ఉన్నాయి. వివిధ రకాల ఉపనిషత్తులలో కూడా ఈ విషయాలే చెప్పబడ్డాయి. మనకు ఉన్నటువంటి దేవతలలో ప్రధానమైనవారు ఐదుగురు 1. ఆదిత్యుడు 2. అంబిక



3. గణపతి 4. విష్ణువు 5. శివుడు. వీరినే పంచాయతనము అంటారు. వీరిలో ఏ దేవతను ఆరాధించేవారు ఆ దేవతనే పరమేశ్వర స్వరూపంగా అభివర్ణించారు. ఆ దేవతయే సృష్టికి మూలకారణము అన్నారు. ఉదాహరణకు **నారాయణోపనిషత్తు**ను చూద్దాం. వైష్ణవులకు ఇది ప్రధానమైన ఉపనిషత్తు. వారి అధిదేవత శ్రీమన్నారాయణుడు లేదా శ్రీమహావిష్ణువు. నారాయణోపనిషత్తులో "సృష్టి ప్రారంభంలో ఉన్నవాడు పరమపురుషుడైన నారాయణుడొక్కడే. అతడు సృష్టిచెయ్యాలి అనుకున్నాడు. అప్పుడు శ్రీమన్నారాయణుని శరీరంనుంచి సూక్ష్మరూపి అయిన హిరణ్యగర్భుడు ఉదయించాడు. ఆ తరువాత తన్మాత్రలు, పంచభూతాలు పుట్టినాయి. ఈ రకంగా నారాయణుని శరీరంనుంచి బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు ఇతర ప్రజాపతులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సకల వేదాలు ఆవిర్భవించినాయి. చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణుని నుంచే ఆవిర్భవించింది. ఇవన్నీ నారాయణునిలోనే ఉన్నాయి. చివరకు నారాయణుని యందే లయమవుతున్నాయి. నారాయణుడే సత్యము నిత్యము అయినవాడు. నారాయణుడే బ్రహ్మ. నారాయణుడే శివుడు. అతడే ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దశ దిశలు అంతా నారాయణుడే. పైభాగాన ఉన్నది, క్రింది భాగాన ఉన్నది, మధ్యభాగాన ఉన్నదీ నారాయణుడే. బాహ్యాభ్యంతరముల యందంతటా నారాయణుడే. భూత భవిష్యద్వర్తమానాలు నారాయణుడే." అని చెప్పబడింది. అంటే చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణునుంచే ఆవిర్భవించింది. ఈ జగత్తు అంతా నారాయణ స్వరూపమే.

అయితే వైష్ణవంలో సృష్టివిధానం ఈ రకంగా కూడా చెప్పబడింది. జగత్తుయొక్క సృష్టి స్థితి లయాలను చూసేది శ్రీమన్నారాయణుడు. ఈయన ఇరవై ఐదు తత్త్వములు గల పురుషుడని వేదాలు కీర్తిస్తున్నాయి. ఇతడు ఆద్యంతములు లేని పురుషోత్తముడు ఈయన కనులు తెరిస్తే పగలు అదే సృష్టి. కనులు మూస్తే రాత్రి (ప్రళయము) ఇదే కల్పము. ఈయన అనంతుడు. ఈయనకు రూపంలేదు. కాళ్ళు చేతులు మొదలైన అంగాలు లేవు. శరీరం లేదు. ఆయన సర్వాన్నీ ఆవరించి ఉన్నాడు. అన్ని ఇంద్రియాల గుణాలను ప్రకాశింపచేస్తున్నాడు. ఇతడే ముక్తి ప్రదాత. అతనివల్లనే సర్వము సంభవిస్తున్నది. ఆ పురుషుని నుండే హిరణ్యగర్భుడు జన్మించాడు. దానినుండి ఆకాశము, వాయువు, తేజస్సు, జలము ఆవిర్భవించినాయి. జలము నుండి ఒక

అండము పుట్టింది. అది హిరణ్మయము. ఈ హిరణ్మయమైన అండమే ప్రజాపతి అని వేదాలు చెబుతున్నాయి. పరమేశ్వరుడు ఈ అండాన్ని రెండు భాగాలుగా చేశాడు. ఇందులో పైభాగము ఆకాశము కాగా క్రింది భాగము రసాతలము. ఈ అండము నుంచి వచ్చిన మావిజలమునందు పడి భూమి ఏర్పడింది. ఆ భూమిమీద అనేకవేల యోజనాల విస్తీర్ణముగల పర్వతాలు, కొండలు, పెద్దపెద్ద చెట్లు అన్నీ ఉన్నాయి. ఆ బరువును మోయలేక భూమినీటిలో మునిగిపోయింది. అలా మునిగిపోతూ తనను రక్షించమని శ్రీహరిని ప్రార్థించింది. అప్పుడు శ్రీహరి ఆదివరాహమై తన కోరలమీద మోసి ఈ భూమిని రక్షించాడు. ఈ రకంగా శ్రీమహావిష్ణువు వల్లనే ఈ సృష్టి జరిగింది. అని చెప్పబడింది.

త్రిమూర్తులలో మూడవవాడైన రుద్రుని పరమేశ్వర స్వరూపంగా (ఇతడే శివుడు) ఆరాధించేవారికి ముఖ్యమైనది **అధర్వశిరోపనిషత్తు** అందులో దేవతలంతా రుద్రుడు నివసించే స్వర్గలోకానికి వెళ్ళి "దేవా ! నీవెవరవు ?" అని అడుగుతారు. దానికి రుద్రుడు "ఈ సృష్టికి ముందు నేను ఒక్కడనే ఉన్నాను. ఇప్పుడున్నాను భవిష్యత్తులోనూ ఉంటాను. నాకన్న వేరైనవారు లేరు. త్రికాలాతీతుడను, నిత్యానిత్యుడను నేనే, బ్రహ్మమును నేనే, చక్షురాది ఇంద్రియాలు నేనే. శ్రోత్రాది ఇంద్రియాలు నేనే. ఊర్ధ్వదిక్కు, అథోదిక్కు, దశదిశలు, విదిశలు నేనే. స్త్రీ, పురుషుడు, నపుంసకుడు నేనే. గాయత్రి నేనే, సావిత్రినేనే, త్రిష్టప్, జగతీ, అనుష్టప్ మొదలైన ఛందస్సులు నేనే. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని నేనే. గోవు నేనే, గౌరీదేవి నేనే, జ్యేష్ఠుడను, శ్రేష్ఠుడను కూడా నేనే. అధికుడను నేనే. జలమునేనే, తేజస్సు నేనే, చతుర్వేదాలు నేనే. ఓంకారము నేనే. పుష్కరము నేనే. పవిత్రము నేనే, అగ్రభాగము, మధ్యభాగము, అథోభాగము నేనే, దశదిశలలో ఉన్నది, లేనిది కూడా నేనే. జ్యోతిరూపుడను నేనే. నేను జగత్తంతా ఆవరించి ఉన్నాను. నేను సర్వవ్యాపిని, సర్వరూపిని చరాచర జగత్తంతా నాచేతనే సృష్టించబడింది." అంటాడు.

శాక్తేయులంతా ఆ పరమేశ్వరిని ఆరాధిస్తారు. పరమేశ్వరిని గురించి వివరించేవి ఎనిమిది ఉపనిషత్తులున్నాయి. అందులో **బహ్వృచోపనిషత్తు** ఒకటి. దానిలో ఈ సృష్టి ప్రారంభానికి ముందు ఆ పరమేశ్వరి ఒక్కతేఉండేది. ఆమెయే ఈ జగత్తును సృష్టించింది. ఆమెయే కామకళ శృంగారకళ. ఆమెనుండి ముందుగా బ్రహ్మ



ఉద్భవించాడు. ఆ తరువాత విష్ణువు, రుద్రుడు, మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, కిన్నెరలు, భోగ్యము ఈ రకంగా అన్నీ ఉద్భవించినాయి. అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, స్థావరములు, జంగమములు, పశువులు, పక్షులు, జంతువులు, మృగాలు, జలచరాలు, చెట్లు, చేమలు చివరకు మానవులు పుట్టారు. ఆమెయే పరాశక్తి. శాంభవి. కాదివిద్య, హాదివిద్య, ఆమెయే త్రిపురసుందరి అని చెప్పబడింది.

శాక్తేయంలో ఇంకొక విషయంకూడా ఉన్నది. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. ఇతడు బిందు రూపంలో ఉన్నాడు. ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం అయిన జీవులు ముక్తిని పొందుతాయి. కర్మక్షయం కాని జీవులు తమ తమ కర్మలను తమతో మూటకట్టుకుని మాయలో కలిసిపోతాయి. ఆ మాయ వచ్చి పరమేశ్వరునిలో చేరుతుంది. ఇప్పుడు కర్మక్షయం కాకుండా తనలో ఇమిడిఉన్న జీవరాశికి మోక్షం కలిగించాలనే ఉద్దేశ్యంతో ఆ పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. ఆ స్థితిలో అతని నుంచి కొంత శక్తి బయటకు వచ్చింది. అదే శక్తి. ఈ శక్తికీ శివుడికీ భేదంలేదు. రెండూ ఒకటే. ఈ శక్తి త్రికోణాకారంలో ఉన్నది. ఇదే మాయ. అవ్యక్తము. దీనినుంచి మహత్తత్త్వము, అహంకారము తన్మాత్రలు, వాటినుంచి పంచభూతాలు పుట్టినాయి. ఈ పంచభూతాలు, తన్మాత్రలు పంచీకరణం చెందటంవల్ల పదిహేను భాగాలుగా అయినాయి. వీటినుంచే జీవరాశి ఆవిర్భవించింది. ఇది రూపాత్మకమైన జగత్తు. ఇక నామాత్మకమైన జగత్తును చూద్దాం. ముందుగా ఓంకారము పుట్టింది. దానినుంచి అకార ఉకార, మకారాలు పుట్టాయి. వాటినుంచి అక్షర సమామ్నాయము వచ్చింది. దానినుంచి పదాలు, మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, సంగీతము, సాహిత్యము అన్నీ ఆవిర్భవించాయి. ఈ రకంగా నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. **'లలితారహస్యోపనిషత్తు'**లో సృష్టి అంతా ఆమెచేతనే చేయబడింది. అని చెప్పటం జరిగింది.

ఇలాకాదు. గుణత్రయ విభాగం చేత సృష్టి ఏర్పడింది. అని కొందరివాదన. గుణాలు మూడు. అవి సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము. సృష్టి మూడు రకాలుగా జరిగింది. 1. ఏకగుణ సృష్టి 2. ద్విగుణసృష్టి 3. త్రిగుణసృష్టి

**1. ఏకగుణసృష్టి :** ఇందులో ఒకే గుణముంటుంది.

సత్త్వగుణంవల్ల – బ్రహ్మాదిదేవతలు

రజోగుణంవల్ల – మానవులు, మృగాలు, పశుపక్ష్యాదులు, జలచరాలు

తమోగుణంవల్ల – చెట్లు, చేమలు, పర్వతాలు

మొదలైనవి ఆవిర్భవించాయి. ఇది ఏకగుణసృష్టి.

**2. ద్విగుణసృష్టి :** ఇందులో ప్రతిగుణము మళ్ళీ మూడుభాగాలు అవుతుంది. దానినుంచి ప్రాణికోటి ఆవిర్భవించింది.

1. సత్త్వసత్త్వము నుంచి – విరాట్పురుషాదులు
2. సత్త్వరజమునుంచి – దేవపురుషులు, వాలఖిల్యులు, వైఖానసులు
3. సత్త్వతమస్సు నుంచి – యక్షులు, రాక్షసులు, విద్యాధరులు
4. రజస్సత్త్వము – మానవులు
5. రజోరజము – పశువులు మృగాలు
6. రజోతమము – స్వేదజాలు, అండజాలు, జలచరాలు
7. తమోసత్త్వము – పైరులు, గడ్డిపంటలు మొ॥
8. తమోరజస్సు – చెట్లు, పొదలు, తీగెలు
9. తమోతమము – భూములు, కొండలు, బండలు

**త్రిగుణసృష్టి :** ఇందులో ప్రతిగుణంలోనూ మూడు భాగాలుంటాయి అవి మళ్ళీ ఒక్కొక్కటి మూడు భాగాలవుతాయి. ఈ రకంగా మొత్తం 27 భాగాలవుతాయి. వీటివల్లనే ఈ జగత్తంతా సృష్టించబడింది.

1. సత్త్వంలో తమోతమము – శేషుడు, వాసుకి మొ॥వారు
2. సత్త్వంలో తమోరజము – దేవతలు, అంగిరసుడు మొ॥వారు
3. సత్త్వంలో తమోసత్త్వము – కర్మదేవతలు, నవగ్రహాలు
4. సత్త్వంలో రజోతమము – సిద్ధులు, సాధ్యులు
5. సత్త్వంలో రజోరజము – సప్తఋషులు, శుకవామదేవాదులు



6. సత్త్వంలో రజోసత్త్వము – దిక్పాలకులు, పంచబ్రహ్మలు
7. సత్త్వంలో సత్త్వతమస్సు – విరాట్టు, హిరణ్యగర్భుడు
8. సత్త్వంలో సత్త్వరజస్సు – సూత్రాత్మ, నిర్వికల్ప సమాధి నిష్ఠులు
9. సత్త్వంలో సత్త్వసత్త్వము – సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము
10. రజంలో తమోతమము – కందిరీగలు, తేళ్ళు, పాములు, చీమలు
11. రజంలో తమోరజము – మొసళ్ళు, పీతలు, నత్తలు
12. రజంలో తమోసత్త్వము – కాకులు, పిచ్చుకలు, చిలకలు, గోరువంకలు
13. రజంలో రజోతమము – సింహాలు, పులులు, ఎలుగుబంట్లు
14. రజంలో రజోరజము – ఏనుగులు, గుర్రాలు, కోతులు, మేకలు
15. రజంలో రజోసత్త్వము – కపిలఆవులు, చమరీమృగాలు, జింకలు, దుప్పులు
16. రజంలో సత్త్వతమము – శూద్రులు, మంగలి, మాల, చాకిలి
17. రజంలో సత్త్వరజము – పుణ్యకర్ములు, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసే పాలకులు
18. రజంలో సత్త్వసత్త్వము – బ్రహ్మవాదులు, వేదవిదులు, దశవిధ బ్రాహ్మణులు ★
19. తమంలో తమోతమం – కొండలు, బండలు, ముళ్ళచెట్లు నిర్జన ప్రదేశాలు, చవిటినేలలు
20. తమంలో తమోరజము – మంచి పంటలు పండే నేలలు, తపస్సు యజ్ఞము చేసే ప్రాంతాలు, దేవబ్రాహ్మణ నివాసాలు
21. తమంలో తమోసత్త్వము – పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు
22. తమంలో రజోతమము – ముష్టి, వేము, బలురక్కసి, నాగజెముడు, తాడి, ఈత
23. తమంలో రజోరజము – నిమ్మ, దానిమ్మ, బత్తాయి, మర్రి, జమ్మి

24. తమంలో రజోసత్త్వము – అరటి, పనస, మామిడి, వెలగ, పద్మ, కలువ, పారిజాతాదులు

25. తమంలో సత్త్వతమము – ఉలవ, జొన్న, అరిగ ధాన్యాలు

26. తమంలో సత్త్వరజము – కంది, మినుము, నువ్వు, నల్లవరి

27. తమంలో సత్త్వసత్త్వము – తెల్లవరి, సన్నవరి, చెరకు, పెసర

★ దశవిధ బ్రాహ్మణులు అంటే – వేదవిద్యా సంపన్నులు, ఆచారవంతులు అయిన 1. ఆంధ్ర, 2. కర్నాటక, 3. ద్రావిడ, 4. ఘూర్జర, 5. మహారాష్ట్రులు వీరు పంచ ద్రావిడులు. 1. ఉత్కల, 2. మైథిల, 3. గౌడ, 4. కన్యాకుబ్జ, 5. సారస్వతులు. వీరు పంచగౌడులు. వీరందరూ కలిసి దశవిధ బ్రాహ్మణులు.

ఈ విధంగా గుణత్రయ విభాగంచేత సృష్టి జరుగుతున్నది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టిని గురించి చెబుతూ

ఈ సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉండేది. అతనికన్న భిన్నమైనదేదీ లేదు. సర్వాత్మ భావంతో తనను మాత్రమే చూసుకుని అంతటా నేనే అనుకున్నాడు.

పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి ఉండి కూడా భయభ్రాంతుడైనాడు. ఒంటరిగా ఉన్న ప్రజాపతి ఒంటరితనంలోని ఆనందాన్ని అనుభవించలేక స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే సౌందర్యవతి అయిన స్త్రీ ప్రత్యక్షమైంది. అంటే తన శరీరంలోని కొంతభాగం నుంచే స్త్రీని సృష్టించాడన్నమాట. ఆ భాగాలే పతి పత్ని. అందుచేతనే లౌకిక శరీరం ధాన్యపుగింజలోని బద్దలాంటిది. రెండు దళాలు లేదా బద్దలు స్త్రీ పురుషులకు ప్రతిరూపాలు.

ప్రజాపతివల్ల కలిగిన స్త్రీ పేరు శతరూప. అనగా అనేకరూపాలు గలది అని అర్థం. ఆ ప్రజాపతే స్వాయంభువమనువు. కుమార్తెలతో రమించటం నిషేధం కదా. మరి తననుండి పుట్టిన నాతో ఏ విధంగా రమిస్తాడు. అని ఆలోచించి శతరూప ఆవుగా మారిపోయింది. పురుషుడు ఆ బోతు అయినాడు. గోసంతతి వృద్ధి చెందింది. శతరూప ఆడుగుర్రము అయింది. పురుషుడు మగగుర్రం అయినాడు. అశ్వసంతతి పెరిగింది. శతరూప ఆడుగాడిద అయ్యింది. పురుషుడు మగగాడిద



అయినాడు. గార్ధభ సంతతి వర్ధిల్లింది. ఈ రకంగా ఆ స్త్రీ 84 లక్షల రూపాలు ధరించింది. పురుషుడు కూడా అన్ని రూపాలు ధరించాడు. జగత్తులో 84 లక్షల రకాలయిన జీవరాశి వృద్ధి చెందింది. అందుచేతనే సృష్టి అనేది ప్రజాపతికి మారుపేరయింది.

సృష్టిని గురించిన మరొక విషయం కూడా బాగా ప్రచారంలో ఉంది. సృష్టి చెయ్యటం కోసం బ్రహ్మ కొంతమందిని సృష్టించాడు. వారినే బ్రహ్మ మానసపుత్రులు అంటారు. వారిలో బ్రహ్మయొక్క కుడిచేతి బ్రొటనవేలు నుంచి పుట్టినవాడు దక్షుడు. ఎడమచేతి బ్రొటనవ్రేలు నుంచి పుట్టినది, వీరిణి అనే కన్య. దక్ష ప్రజాపతి వీరిణిని వివాహం చేసుకున్నాడు. వీరికి యాభైమంది కుమార్తెలు కలిగారు. వారిలో అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృథ, విశ్వ, వినత, కద్రువ, కపిల అనే పన్నెండు మందిని మరీచి కుమారుడైన కశ్యపుడు వివాహం చేసుకున్నాడు. వీరిలో అదితివల్ల దేవతలు, దితివల్ల దైత్యులు, దనువు వల్ల దానవులు, వినతవల్ల పక్షులు, కద్రువ వల్ల పాములు. ఈ రకంగా వివిధ రకాల జీవరాసి ఆవిర్భవించింది.

**సుబాలోపనిషత్తు**లో సృష్టికి పూర్వం ఈ జగత్తంతా పరమేశ్వరమయంగా ఉండేది. ఆ పరమేశ్వరుని నుంచి ముందుగా తమస్సు పుట్టింది. తమస్సు నుండి తన్మాత్రలు, వాటినుండి పంచభూతాలు పుట్టినాయి. అది ఒకగ్రుడ్డుగా అయింది. పన్నెండు నెలల తరువాత పరమేశ్వరుడు ఆ గ్రుడ్డును రెండుగా చేశాడు. దానిలోని క్రింది భాగము భూమి, పైభాగము ఆకాశము అయింది. మధ్యభాగంలో దివ్యపురుషుడు, సహస్రశీర్షుడు, వేయికనులు, వేయిపాదాలు, వేయిచేతులు, గలవాడున్నాడు అతడే బ్రహ్మ. అతడు ముందుగా మృత్యువును సృష్టించాడు. అది మూడు అక్షరములు, మూడు శిరస్సులు గలది. ఆ తరువాత అతడు ఏడుగురు మానస పుత్రులను సృష్టించాడు. వీరు విరాట్టులు. ఏడుగురు ప్రజాపతులను సృష్టించాడు. ఆ పరమ పురుషుడైన బ్రహ్మ ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యులు, పాదముల నుంచి శూద్రులు, మనసు నుంచి చంద్రుడు, కనుల నుంచి సూర్యుడు, చెవుల నుంచి వాయువు, హృదయము నుండి సర్వజగత్తు పుట్టినాయి.

అపానము నుండి నిషాదులు, ఎముకల నుండి యక్షులు, రాక్షసులు, గంధర్వులు, రోమముల నుండి - పర్వతాలు, లలాటమునుండి - ఓషధులు, వనస్పతులు, క్రోధము నుండి - రుద్రుడు పుట్టారు. ఈ మహాభూతముయొక్క నిట్టూర్పునుండి - నాలుగు వేదాలు, శిక్ష, కల్పము, వ్యాకరణము, జ్యోతిషము, నిరుక్తము, ఛందస్సు, తర్కము, మీమాంస, ధర్మసూత్రాలు, వ్యాఖ్యానాలు, ఉపవ్యాఖ్యానాలు, సర్వభూతములు వచ్చినాయి. అని చెప్పబడింది.

**మహోపనిషత్తు**లో ఆ పరమ పురుషుని నుండి 14 మంది పురుషులు, ఒక కన్య జన్మించారు. తరువాత జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5. మనస్సు. మొత్తం పదకొండు ఇంద్రియాలు ఆవిర్భవించాయి. 12. అహంకారము, 13. ప్రాణము, 14. దేహము, 15. బుద్ధి 16. తన్మాత్రలు ఐదు. పంచభూతాలు ఐదు. ఉద్భవించినాయి. ఈ రకంగా 25 తత్త్వములతో నిండిన విరాట్ పురుషుడు జన్మించాడు. ఈ సృష్టిలో పరమాత్మ అధిష్ఠాన రూపంలో ప్రవేశించాడు. 25 తత్త్వాలతో ఉన్న ఆ విరాట్పురుషుని నుండి ప్రధాన సంవత్సరాలు కాలస్వరూపంలో పుట్టినాయి. ఆ తరువాత పరమపురుషుడు ఇంకొక సంకల్పముతో హృదయంలో ధ్యానంచేశాడు. ధ్యానంలో ఉన్న అతని లలాటము నుంచి త్రినేత్రుడు, త్రిశూలపాణి అయిన పురుషుడు జన్మించాడు. తేజోవంతుడైన ఆ పురుషుని యందు యశస్సు, సత్యము, బ్రహ్మచర్యము, తపస్సు, వైరాగ్యము, మనస్సు, ఐశ్వర్యము, ప్రణవసహిత వ్యాహృతులు, చతుర్వేదాలు, సకల ఛందస్సులు ఇవన్నీ ప్రకాశిస్తున్నాయి. అందుచేత ఇతడు ఈశానుడు, మహాదేవుడు అనబడ్డాడు.

తరువాత మరి ఒక సంకల్పంతో పరమపురుషుడు మళ్ళీ ధ్యానం చేశాడు. ధ్యానంలో ఉన్న అతని లలాటము నుంచి శ్వేదము పుట్టిది. ఆ శ్వేదమే సర్వత్రా వ్యాపించి జలమయింది. ఈ ఉదకము నుండి బంగారుకాంతి గల అండము ఒకటి పుట్టింది. దానినుండి చతుర్ముఖబ్రహ్మ పుట్టాడు. ఈ బ్రహ్మ తూర్పు దిక్కుకు తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు భూః అనే వ్యాహృతి, గాయత్రీ ఛందస్సు, ఋగ్వేదము, అగ్నిదేవత ఆవిర్భవించాయి. బ్రహ్మ పశ్చిమ దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు భువః అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, యజుర్వేదము, వాయుదేవత ఆవిర్భవించాయి. తరువాత బ్రహ్మ ఉత్తర దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు సువః అనే



వ్యాహృతి, జగతీ ఛందస్సు, సామవేదము, సూర్యుడు ఆవిర్భవించారు. తరువాత బ్రహ్మ దక్షిణ దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు మహః అనే వ్యాహృతి, అనుష్టుప్ ఛందస్సు, అధర్వణవేదము, సోమదేవత ప్రభవించినాయి. ఆ తరువాత బ్రహ్మ మళ్ళీ మళ్ళీ ధ్యానం చేసి క్షీరసాగర మధ్యంలో ఒక దేవుని దర్శించాడు. ఆ దేవత వేయితలలతోను, వేలకనులతోను ప్రకాశిస్తున్నాడు. విశ్వకళ్యాణ కారకమై, విశ్వాతీతమై, నిత్యమై విలసిల్లుతున్నాడు. అతడు సర్వరూపి. సర్వవ్యాపి. అతడే పరమేశ్వరుడు. నారములయందుంటాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు. ఈ చరాచర జగత్తూ అతనినుండే ఆవిర్భవించింది. ఈ జగత్తుకు ఆధారమైనవాడు అతడే.

**ఐతరేయోపనిషత్తు**లో సృష్టిని గురించి వివరించటం జరిగింది. సృష్టికి పూర్వం జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏదీలేదు. దాన్నే ఆత్మ అంటారు. ఈ ఆత్మలోకాలను సృష్టించాలనుకొన్నది. మరీచి, ఆపః, మర అనే పేర్లు గల లోకాలను సృష్టించింది. ద్యులోకానికి ఆవల ఉన్నది అంభస్సు. దానికి ఆశ్రయము స్వర్గము. అదే సువర్లోకము. దానిక్రింద భువర్లోకము. దాని క్రింద భూలోకము ఉన్నాయి. ఈ భూలోకము మరణము గుణముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతిప్రాణీ మరణిస్తుంది. భూలోకానికి క్రింద జలలోకమున్నది. అది క్రిందఉన్న లోకాలచేత పొందబడుచున్నది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి.

లోకాలను సృష్టించిన తరువాత 'ఈ లోకాలను రక్షించేవాళ్ళు లేకపోతే అవి నాశనమై పోతాయి. కాబట్టి లోకపాలకులను సృష్టించాలి' అని ఆలోచించి పంచభూతాలలోను ప్రధానమైనదైన జలాన్ని తీసుకుని దానితో అవయవాలుగల ఒక మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే విరాట్స్వరూపము. ఇక ఇంద్రియాధిష్ఠాన దేవతల సృష్టి.

పరమాత్మ ఈ విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు, దాని ఫలితంగా విరాట్స్వరూపానికి నోరు వచ్చింది. ఆ నోటి నుండి మాట, మాట నుండి వాణికి అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు రంధ్రాలు వచ్చాయి. వాటినుండి ప్రాణం ఉత్పన్నమైంది. అనగా వాసన చూసే శక్తి పుట్టింది. ఆ ఘ్రాణశక్తి నుండి వాయువు పుట్టింది. తరువాత నేత్రాలు వచ్చాయి. వాటినుండి సూర్యుడు ఉద్భవించాడు.

తరువాత చెవులు ఏర్పడ్డాయి. వాటి నుండి దిక్కులు వచ్చాయి. తరువాత చర్మము దాని నుండి స్పర్శకు కారణమైన రోమాలు ఏర్పడ్డాయి. చర్మము నుండే ఓషధులు వనస్పతులు ఏర్పడ్డాయి. తరువాత హృదయము దానినుండి మనస్సు, దాని నుండి చంద్రుడు పుట్టారు. తరువాత నాభి, దాని నుండి అపానము, దాని నుండి మృత్యువు ఉద్భవించాయి. తరువాత పురుష జననేంద్రియము, దాని నుంచి వీర్యము, దానికి అధిష్ఠానమైన జలము పుట్టాయి. ఈ రకంగా విరాట్స్వరూపుని అవయవాల నుండి ఇంద్రియాలు, వాటి అభిమానదేవతలు పుట్టారు.

పరమేశ్వరునిచే లోకపాలకులుగా సృష్టించబడ్డ అగ్ని మొదలైన ఇంద్రియాభిమాన దేవతలు అవిద్యతో కూడిన మహాసముద్రంలో పడ్డారు. దానికి అంతం లేదు. అది ఇంద్రియాలవల్ల కలిగే క్షణిక సుఖాలతో కూడినది.

పరమేశ్వరుడు ఆ విరాట్స్వరూపానికి ఆకలి దప్పికలు కలిగేలా చేశాడు. అప్పుడు దేవతలందరూ మేము కూర్చుని భుజించేందుకు వీలుగా, మాకు తగిన స్థానాన్ని ప్రసాదించమని వేడుకున్నారు. ఆకలి తీరాలంటే ఆహారం కావాలి. అన్ని ఇంద్రియాలకు ఆహారం అన్నమేకాదు. వాటి ఆహారము వేరుగా ఉంటుంది.

అప్పుడు దేవతలకోసం పరమేశ్వరుడు ఆవును సృష్టించాడు. దేవతలు ఇది మాకు సరిపోదు అన్నారు. గుర్రాన్ని సృష్టించాడు. అది చాలదన్నారు. అప్పుడు విరాట్స్వరూపాన్ని పోలిన పురుషుడినే సృష్టించాడు. దాన్ని చూసిన దేవతలు ఇది చాలా బాగుంది అని సంతసించారు. పరమేశ్వరుని ఆజ్ఞానుసారం ఇంద్రియాది దేవతలంతా వారివారి స్థానాల్లో ప్రవేశించారు. అంటే అగ్ని వాగ్రూపం ధరించి పురుషుని నోటిలో ప్రవేశించింది. వాయువు ప్రాణరూపం ధరించి ముక్కులో ప్రవేశించింది. సూర్యుడు దృష్టిరూపంలో నేత్రాలలోను, దిక్కులు చెవులయందు, ఓషధులు, వనస్పతులు చర్మమునందు, చంద్రుడు మనోరూపం ధరించి హృదయమందు, మృత్యువు అపానరూపం దాల్చి నాభియందు, జలం వీర్యరూపం దాల్చి జననేంద్రియమందు ప్రవేశించాయి. ఈ రకంగా దేవతలంతా వెళ్ళిపోగా ఇంకమిగిలినవి ఆకలి దప్పికలు. వీరిద్దరినీ పరమేశ్వరుడు దేవతలందరిలోనూ భాగస్వాములుగా చేశాడు. దీనివల్ల ఏ దేవతకు హవిస్సు ఇచ్చినా, దానిలో ఆకలి



దప్పికలకు కూడా భాగం కలుగుతుంది. కంటికి ఆకలి దప్పిక అంటే చూడాలనే కోరిక. చెవులకు వినాలనే కోరిక.

ఈ రకంగా ఇంద్రియాలను వాటి అధిష్ఠాన దేవతలను సృష్టించిన తరువాత అన్నాన్ని సృష్టించవలసి వచ్చింది. అప్పుడు జలం నుంచి ఆహారం సృష్టించాడు. అదే అన్నము.

ఇప్పుడు పరమేశ్వరుడు ఇంద్రియాలతోకూడిన మానవశరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. దానికి రెండు మార్గాలున్నాయి. 1. పాదాల చివర నుంచి అంటే క్రింది నుంచి, 2. శిరస్సు నుంచి అంటే బ్రహ్మరంధ్రం నుంచి. పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం ద్వారా మానవశరీరంలో ప్రవేశించాడు.

ఈ రకంగా పరమేశ్వరుడు జీవకోటిని సృష్టించి, తాను ఆ జీవకోటిలో ప్రవేశించి జగత్తంతా తానే అయినాడు." అని చెప్పబడింది.

**పురుషసూక్తం**లో పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు అని చెబుతూ, ఆ పరమేశ్వరుని ముఖము నుంచి-బ్రాహ్మణులు, బాహువుల నుంచి – క్షత్రియులు, ఊరువుల నుంచి – వైశ్యులు, పాదములనుంచి – శూద్రులు, మనస్సునుంచి – చంద్రుడు, కనులనుంచి – సూర్యుడు, ముఖము నుంచి – ఇంద్రుడు, అగ్ని, ప్రాణముల నుంచి – వాయువులు, నాభినుంచి – అంతరిక్షము, పాదములనుంచి – భూమి, శ్రోత్రముల నుంచి దిక్కులు ఉద్భవించాయి. అని చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వర స్వరూపం నుంచే చరాచరజగత్తంతా ఆవిర్భవించింది. ఈ దేహము పాంచభౌతికమైనది. శరీరంలో శ్రోత్రాదులు అంటే కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము. ఇవి జ్ఞానేంద్రియాలు. వీటిలో శ్రోత్రము – ఆకాశాంశ, చర్మము – వాయు అంశ, కనులు – అగ్ని, నాలుక – జలము, ముక్కు – భూమి. అలాగే కర్మేంద్రియాలు కూడా పంచభూతాల నుండి కలిగినవే. ఈ విధంగా చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపంతప్ప వేరుకాదు.

ఈ రకంగా చరాచర జగత్తులో 84 లక్షల రకాలయిన జీవరాశి ఆవిర్భవించింది.

**పైంగలోపనిషత్తు**లో సృష్టిని గురించి చెప్పబడింది. ఈ సృష్టికి పూర్వము పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. అదే ఆత్మ. అది నిత్యముక్తమైనది. వికారములు లేనిది.

సత్యజ్ఞానానందమయమైనది. పరిపూర్ణమైనది. సనాతనముగా ఉన్నది. ఏకముగా ఉన్నది. రెండవది లేనిది. అదే పరబ్రహ్మ. ఆ బ్రహ్మయందు ఎడారులలో మృగతృష్ణలాగా, ముత్యపు చిప్పలో వెండిలాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికంలోని రేఖలలాగా, అనిపిస్తూ ఎరుపు, తెలుపు, నలుపు, గల సమాన త్రిగుణాలు గలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూల ప్రకృతిలోప్రతిబింబించిన పరబ్రహ్మమే సాక్షిచైతన్యముగా ఉన్నది. ఆ మూల ప్రకృతి మళ్ళీ వికారము పొంది సత్త్వగుణమువల్ల ఉద్రేకము పొంది అవ్యక్తమనే పేరుతో ఆవరణ శక్తిగా ఉన్నది. ఈ ఆవరణలో ప్రతిబింబించిన పరబ్రహ్మ ఈశ్వరచైతన్యము.

ఈ అవ్యక్తాన్ని స్వాధీనంలో ఉంచుకున్నవాడు పరమేశ్వరుడు. సృష్టి స్థితి లయాలకు కారణభూతుడు అవుతూ జగత్తుకు అంకురముగా ఉన్నాడు. ఈశ్వరుడు తనయందు లీనమైన జగత్తులో అంతటా తానే ఆవిర్భవింపజేసి ఉన్నాడు. ఇతడే ప్రాణులకు వారి కర్మలననుసరించి ఫలితాన్ని ఇస్తున్నాడు. ఈశ్వరుడే అధిష్ఠానముగా ఉన్న ఆ పరమశక్తి నుండి రజోగుణముతో ఉద్రిక్తమైన మహత్తు అనే పేరుగల విక్షేప శక్తి ఏర్పడింది. ఈ మహత్తునందు ప్రతిఫలించిన బ్రహ్మము హిరణ్యగర్భుడు అనబడుతోంది. ఆ హిరణ్యగర్భుడు మహత్తత్త్వమునందు అభిమానము గలవాడై స్పష్టమైనది. అస్పష్టమైనది అయిన శరీరము ధరించాడు.

హిరణ్యగర్భునిచే అధిష్ఠింపబడిన మహత్తునుండి (విక్షేపశక్తి) తమోగుణ ప్రధానమైన అహంకారము అనే స్థూలశక్తి వచ్చింది. అటువంటి అహంకారమునందు ప్రతిబింబించిన పరబ్రహ్మ విరాట్ అనే చైతన్యముగా ఉన్నది. ఆ విరాడ్రూపమే శ్రీమహావిష్ణువుగా ఉన్నాడు. ఆ విరాట్పురుషుని నుంచి సూక్ష్మాకాశ భూతము పుట్టింది. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలము నుంచి భూమి పుట్టినాయి. సూక్ష్మభూతాలుగా ఉన్న ఈ తన్మాత్రలు త్రిగుణ సహితముగా ఉన్నాయి. సృష్టి చెయ్యాలనే సంకల్పంగల ఆ జగత్కర్త, తమోగుణముతో సూక్ష్మపంచభూతాలను స్థూలం చెయ్యాలి అనుకున్నాడు. సృష్టికి పరిమితమైన సూక్ష్మ పంచభూతాలలో ఒక్కొక్క భూతాన్ని రెండు భాగాలుగా చేశాడు. ప్రతిభూతములోను మొదటి భాగాన్ని అలాగే ఉంచి, రెండవభాగాన్ని నాలుగు భాగాలుగా చేశాడు. ఇందులో ఒక్కొక్క భాగంలోను మిగిలిన భూతముల ద్వితీయాంశలను కలిపి



పంచీకరణ చేశాడు. అప్పుడు పంచీకరణ ఎలా జరిగిందంటే – భూమిని రెండు భాగాలుగా చేశాడు. అందులో మొదటి సగం భూమి. మిగిలిన సగభాగాన్ని నాలుగు ముక్కలుగా చేశాడు. ఇదే రకంగా అన్ని భూతాలను విభజించి, రెండవ సగంలో మిగిలిన భూతాలను ఉంచాడు. అంటే భూమిలో 1/2 భూమి, ఆకాశము 1/8, వాయువు 1/8, అగ్ని 1/8, జలము 1/8. ఇది పృథివీ పంచీకరణము. ఈ విధంగా పంచీకరించిన భూతాలతో అనంతకోటి బ్రహ్మాండాలను, లోకాలను, గోళాలను సృష్టించాడు.

ఈశ్వరుడు పంచమహాభూతాలయొక్క రజోగుణ భాగాలను నాలుగు భాగాలుగా చేసి, ఆ భాగములలో మూడు భాగాల నుండి ప్రాణశక్తిని సృష్టించాడు. తరువాత పంచభూతముల నాల్గవభాగంతో కర్మేంద్రియాలను సృష్టించాడు. తరువాత ఆ ఈశ్వరుడు పంచభూతాల సత్వాంశలను నాలుగు భాగాలు చేశాడు. అందులో మూడు భాగాల నుంచి అంతఃకరణను సృష్టించాడు. తరవాత నాల్గవ సత్వభాగముతో జ్ఞానేంద్రియాలను సృష్టించాడు. సత్త్వసమిష్టివల్ల ఇంద్రియ పాలకులైన దేవతలను సృష్టించాడు. ఈ రకంగా సృష్టించబడిన ఇంద్రియాలను అండములోపల వ్యాపింప చేశాడు. ఈశ్వరుని ఆజ్ఞతో సృష్టించబడినవన్నీ అండమంతటా పూర్తిగా వ్యాపించి ఉన్నాయి. ఈశ్వరుని ఆజ్ఞతో అహంకార సహిత విరాట్టు సమస్త స్థూలాన్ని సృష్టించాడు. ఈశ్వరుని ఆజ్ఞతో హిరణ్యగర్భుడు సూక్ష్మభూతాలను పరిపాలించాడు.

అండములో ఉన్న దేహేంద్రియాలు, చైతన్యమూర్తి అయిన ఈశ్వరుడు లేకుండా, స్పందన కలిగి ఉండటానికి, పని చేయటానికి సమర్థత లేకుండా ఉన్నాయి. ఈశ్వరుడు ఆ దేహాదులను చైతన్యవంతులుగా చెయ్యాలని సంకల్పించాడు. బ్రహ్మాండాలను, బ్రహ్మరంధ్రములను, సమస్త వ్యష్టిశరీర మస్తకములను బ్రద్దలు చేసి వాటన్నింటి యందు చైతన్యరూపంతో తాను ప్రవేశించాడు. అంటే జగత్తులో ఉన్న జీవరాశి యందంతటా తాను ప్రవేశించాడని అర్థం. ఈ శరీరాలన్నీ మొదట జడములుగా ఉన్నాయి. కాని ఈశ్వరుడు ప్రవేశించగానే చైతన్యవంతమై తమ తమ పనులు చెయ్యటం మొదలుపెట్టినాయి. సర్వజ్ఞుడైన ఈశ్వరుడు మాయాలేశ సమన్వితుడై, మోహపెట్టబడి జీవత్వము పొందాడు. అంటే శరీరంలో ప్రవేశించిన ఈశ్వరుడు మాయచేత అజ్ఞాని అయి కర్తృత్వము, భోక్తృత్వము కలవాడయినాడు. జీవుడుగా

ఉన్న ఈశ్వరుడు దేహమే తాను అనేభ్రాంతితో స్థూల సూక్ష్మకారణ దేహాలను అనుభవించటంచేత, మేల్కొనటం, నిద్రపోవటం, కలలు కనటం మరణించటం అనే ధర్మాలు గలవాడై కుమ్మరివాని సారెలాగా సంసారచక్రంలో పరిభ్రమిస్తున్నాడు అని చెప్పబడింది.

ఈ రకంగా సృష్టిని గురించి అనేకచోట్ల అనేక రకాలుగా చెప్పారు. అంతేకాదు భూత పంచీకరణలో కూడా రకాలున్నాయి. ఏదీ ఏమయినా ఈ సృష్టి అంతా పరమేశ్వరుడే చేశాడు. ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపము అనేది మాత్రం నిశ్చయం. అంటూ సృష్టి జరిగిన విధానాన్ని వివరించాడు రత్నాకరుడు.

## 3. శరీర విజ్ఞానము (శారీరకోపనిషత్తు, గర్భోపనిషత్తు)

"గురువుగారూ ! అసలు ఈ లోకంలో జీవి ఏ విధంగా ఆవిర్భవిస్తుంది ? మాతృగర్భంలో. పిండోత్పత్తి ఎలా జరుగుతుంది ? ఈ దేహము ఎలా ఏర్పడుతుందో? వివరించండి" అన్నాడు నారాయణభట్టు. ఆ మాటలు విన్న రత్నాకరుడు.

"నారాయణభట్టారకా ! నీ ప్రశ్న చాలా బాగుంది. జీవి ఆవిర్భావము, గర్భంలో పిండోత్పత్తి అనే విషయాలను వివరిస్తాను. శ్రద్ధగా విను అంటూ చెప్పటం మొదలు పెట్టాడు. ఈ జగత్తులో పుట్టిన ప్రతిప్రాణీ మరణించక తప్పదు. అలా మరణించిన జీవుడు తన పాపపుణ్యాలను మూట కట్టుకుని పైలోకాలకు వెళ్ళి, తన పుణ్యఫలంతో స్వర్గలోకంలో సమస్త సుఖాలు, నరకంలో శిక్షలు అనుభవించి కర్మశేషాన్ని అనుభవించటానికి మేఘాన్ని ఆశ్రయిస్తాడు. ఆ మేఘం వర్షంగా కురుస్తుంది. ఆ వర్షపు నీటివలన ఏరులు, నదులు పొంగుతాయి. అలా ప్రవహించే నదులనుండి కాలువలు తీస్తారు. వీటి సాయంతో పంటలు పండుతాయి. గడ్డి, చెట్లు పెరుగుతాయి. గతంలో మేఘాన్ని ఆశ్రయించిన జీవి వర్షపు నీటి ద్వారా భూమి మీదకు చేరి విత్తనాలలో కలసి మొలకెత్తి వాటి ఫలితాన్ని అనుభవించే పురుషుని శరీరంలో ప్రవేశిస్తాడు. అతని కర్మఫలాన్ని బట్టి గడ్డిరూపంలో పశువు శరీరంలో ప్రవేశిస్తాడు. మానవజన్మ ఎత్తే ప్రాణి పురుషుని ఆశ్రయిస్తాడు.

మానవుడు తీసుకున్న ఆహారం జీర్ణమై రసంగా మారుతుంది. ఆ రసము నుండి రక్తము, రక్తము నుండి మాంసము, మాంసము నుండి క్రొవ్వు, క్రొవ్వు



నుండి ఎముకలు, ఎముకల నుండి మజ్జ, మజ్జ నుంచి శుక్లము ఏర్పడుతుంది అదే విధంగా స్త్రీ గర్భంలో శోణితము ఏర్పడుతుంది. స్త్రీ పురుషుల సమాగమం జరిగిన మొదటి రాత్రి శుక్లశోణితాలు కలిసి ముద్దగా తయారవుతుంది. ఏడు రోజుల తరువాత ఆముద్ద నీటిబుడగలా మారుతుంది. పదిహేను రోజులకు పిండము అవుతుంది. అదే పిండము నెలరోజులకు గట్టిపడుతుంది. ఈ సమయంలో గర్భంలో ఉన్న పిండానికి ఒకటే ముఖము ఉంటుంది. దానిద్వారానే ఆ బిడ్డ తల్లిద్వారా ఆహారం తీసుకుంటుంది. అందుకే ఆ ముఖాన్నే నోరు అంటారు. ఈ రకంగా గర్భస్థ శిశువుకు మొదటి నెలలో నోరు ఏర్పడుతుంది. రెండవ నెలలో శిరస్సు ఏర్పడుతుంది. ఈ నెలలోనే శ్వాసతీసుకునే అవయవం ముక్కు ఏర్పడుతుంది. ఇక మూడవనెలలో మాతృగర్భంలోని శిశువుకు కనులు ఏర్పడతాయి. ఈ సమయంలోనే పాదాలుకూడా ఏర్పడతాయి. నాల్గవనెలలో చెవులు, చెవులతోపాటుగా కడుపు, నడుము కూడా ఏర్పడతాయి. ఇక ఐదవ నెలలో చర్మము ఏర్పడుతుంది. చర్మముతో పాటుగా వెన్నెముక ఏర్పడుతుంది. ఆరవనెలలో సర్వావయవాలు ఏర్పడతాయి. ఏడవ నెలలో ప్రాణం వస్తుంది. అంటే గర్భస్థ శిశువుకు చలనం వస్తుందన్నమాట.

ఒకవేళ ఏ కారణం చేతనైనా ఏడవ నెలలో ప్రసవం జరిగితే బిడ్డ క్షేమంగా జీవిస్తుంది. అంతకుముందు అంటే ఆరు నెలలలోగా ప్రసవం జరిగితే బిడ్డ జీవించదు. ఈ కారణంచేతనే ఏడవ మాసంలో ప్రాణము వస్తుంది అని చెప్పటం జరిగింది. ఇక ఎనిమిదవ మాసంలో అవయవ సౌష్టవం వస్తుంది. అంటే అవయవాలన్నీ సంపూర్ణంగా పెరుగుతాయి. తొమ్మిదవ మాసంలో బిడ్డ సలక్షణంగా పెరిగి, గర్భం ధరించిన 280 రోజులకు అనగా తొమ్మిదవ మాసం పూర్తి అయిన పది రోజులకు ప్రసవం జరిగి, గర్భస్థ శిశువు ఈ లోకంలో కాలు పెడుతుంది.

స్త్రీ యొక్క గర్భంలో, పురుషుని శుక్లము నుంచి వచ్చిన పురుష కణాలు శోణితముతో సంయోగం చెందితే మగశిశువు, శుక్లమునుంచి వచ్చిన స్త్రీ కణాలు శోణితముతో సంయోగము చెందితే ఆడశిశువు జన్మిస్తుంది. ఒకవేళ శోణితముతో శుక్లము నుంచి వచ్చిన పురుష కణాలు, స్త్రీ కణాలు రెండూ సంయోగము చెందితే నపుంసకులు పుడతారు. సంయోగ సమయంలో తల్లిదండ్రుల మానసిక ప్రవృత్తి

ననుసరించి పిల్లలు జన్మిస్తారు. ఆ సమయంలో తల్లిదండ్రులు చిత్త చాంచల్యానికి గురి అయితే కుంటి, గ్రుడ్డి, మూగ, చెవిటి, పిల్లలు పుడతారు.

సూర్యచంద్రులకు మానవ దేహంతో ప్రత్యక్ష సంబంధమున్నది. చంద్రుడు మనః కారకుడు. సూర్యుడు తేజస్సుకు, ప్రాణానికి కారకుడు. అందుచేత చంద్ర, సూర్యగ్రహణాలు ఏర్పడిన సమయంలో గర్భధారణ జరిగినట్లైతే పుట్టబోయే బిడ్డలకు అంగవైకల్యం కలుగుతుంది. అయితే గర్భిణీ స్త్రీలు గ్రహణం చూస్తే పుట్టబోయే బిడ్డలకు అంగవైకల్యం కలుగుతుందని ప్రచారంలో ఉన్నది. అది నిజంకాదు.

ఒకేసారి స్త్రీ గర్భాశయము నుంచి రెండు అండాలు విడుదలయితే కవలలు కలుగుతారు. విడుదల అయిన రెండు అండాలు కొంతమేరవరకు కలసి ఉన్నట్లైతే ఒకరితో ఒకరు అంటుకు పోయిన కవలలు (సనామీకవలలు) కలుగుతారు. మంచి ముహూర్తంలో ప్రశాంత వాతావరణంలో, ఆహ్లాదకర పరిస్థితులలో గర్భధారణ జరిగినట్లైతే, తల్లిదండ్రుల రూపము, గుణాలు కలిగిన పిల్లలు పుడతారు.

అసలు ఈ దేహము పంచభూతాత్మకమైనది. వీటిలో కఠినముగా ఉండేది భూమి. ద్రవరూపంలో ఉండేది జలం. ఉష్ణమైనది అగ్ని. సంచరించే స్వభావం గలది వాయువు. ద్వారము గలది ఆకాశము. వీటి ప్రతిరూపాలే జ్ఞానేంద్రియాలు అవి ఐదు. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము. వీటిలో భూమి ధరించటము, జలము- ముద్ద చెయ్యటము, అగ్ని - రూపాన్ని చూడటము, వాయువు - సంచరించటము, ఆకాశము - అవకాశమివ్వటము జరుగుతుంది. పంచభూతాల లక్షణాలే తన్మాత్రలు అవే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. 1. ఆకాశము యొక్క లక్షణం శబ్దం. అది చెవియందు ఉండి శబ్దగ్రహణం చేస్తుంది. 2. వాయువు లక్షణం స్పర్శ, అది చర్మము నందుండి ఉనికిని గ్రహిస్తుంది. 3. అగ్నియొక్క లక్షణం రూపము. అది కంటియందుండి వస్తువు రూపాన్ని చూస్తుంది. 4. జలము లక్షణం రసము అది నాలుక యందుండి రుచిని గ్రహిస్తుంది. 5. భూమియొక్క లక్షణం గంధం. అది ముక్కునందుండి వాసన చూస్తుంది. ఈ రకంగా ఇంద్రియాలకు పంచభూతాల తత్త్వాలున్నాయి. కాలు, చేయి, నోరు, పాయు, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు. వీటిలో కాలు నడుస్తుంది. చేయి ఇస్తుంది. నోరు మాట్లాడుతుంది.



పాయువు విసర్జిస్తుంది. ఉపస్థ ఆనందం కలుగజేస్తుంది. ఇక మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. వీటిని అంతఃకరణ చతుష్టయము అంటారు. వీటిలో

1. సంకల్ప వికల్పాలను చేసేది - మనస్సు

2. నిశ్చయించేది-బుద్ధి 3. అవధరణాత్మకమైనది చిత్తము 4. స్వాభిమానమైనది - అహంకారము. బుద్ధితో గ్రహిస్తాడు. నిశ్చయిస్తాడు. మనసుతో సంకల్పం చేస్తాడు. సంశయిస్తాడు. అహంకారముతో గర్వము గలిగి ఉంటాడు.

1. మనసుయొక్క వాసనా స్థానము - కంఠము
2. బుద్ధి యొక్క వాసనా స్థానము - ముక్కు
3. చిత్తముయొక్క వాసనాస్థానము - నాభి
4. అహంకారము యొక్క వాసనాస్థానము - హృదయము

ఈ రకంగా ఉన్న దేహంలో ఎముకలు, చర్మము, నరాలు, వెంట్రుకలు, మాంసము ఇవి పృథివి యొక్క అంశలు.

మూత్రము, కఫము, రక్తము, శుక్లము - ఇవి జలముయొక్క అంశలు.

ఆకలి, దప్పిక, సోమరితనము, మోహము, మైథునము ఇవి అగ్ని అంశలు.

నడచుట, గీరుట, కనులు మూయుట, తెరచుట - ఇవి వాయువు అంశలు.

కామము, క్రోధము, లోభము, మోహము, భయము - ఇవి ఆకాశము అంశలు.

అయితే ఈ భూతాలకు ప్రత్యేక లక్షణాలున్నాయని గతంలో చెప్పుకున్నాం. పంచభూతాలు పంచీకరణ చెందినాయి.

ఆకాశము లక్షణము - శబ్దము

వాయువు లక్షణము - శబ్దము, స్పర్శ

అగ్ని యొక్క లక్షణము - శబ్దము, స్పర్శ, రూపము

జలము యొక్క లక్షణము - శబ్దము, స్పర్శ, రూపము, రసము

భూమియొక్క లక్షణము - శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము

మానవదేహము ఐదు వస్తువులలో నున్నది. ఆరింటిని ఆశ్రయించి ఉన్నది. ఆరు గుణములతో కూడి ఉన్నది. ఏడు ధాతువులను, మూడు మలములను, మూడు గుణములను, నాలుగు అవస్థలను కలిగి ఉన్నది. వీటిలో ఐదు వస్తువులే పంచ భూతాలు. వీటిని వివరించటం జరిగింది. ఆరింటిని ఆశ్రయించి ఉన్నది. ఈ ఆరు షడ్రసాలు. పులుపు, ఉప్పు, తీపి, కారం, చేదు, వగరు. అలాగే షడ్విధవికారాలు.

1. ఉండుట 2. పుట్టుట 3. వృద్ధి పొందుట 4. పక్వమగుట 5. కృశించుట 6. నశించుట.

మానవ దేహంలో చక్రాలు ఆరు. 1. మూలాధారము 2. స్వాధిష్ఠానము 3. మణిపూరము 4. అనాహతము 5.విశుద్ధి చక్రము 6. ఆజ్ఞాచక్రము. వీటినే షట్చక్రాలు అంటారు. ఈ చక్రాలు ఆయా నాడుల నాశ్రయించి ఉంటాయి. ఇక కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము. వీటినే అరిషడ్వర్గాలు అంటారు. శమము, దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము. ఈ ఆరు గుణాలు వాటి నిష్ఠతో చేరి ఉంటాయి. మానవశరీరము సప్తధాతువులను కూడి ఉంటుంది. అవి 1. శుక్లము, 2. శోణితము, 3. మాంసము 4. ఎముకలు 5. చర్మము 6.చీము 7. రక్తము సప్తస్వరాలను కూడి ఉంటుంది. సప్తస్వరాలు వీటినే స, రి, గ, మ, ప, ద, ని అంటారు

1. షడ్జము 2. రిషభము 3. గాంధారము 4. పంచమము 5. మధ్యమము 6.దైవతము 7. నిషాదము. ఇవి తెలుపు, ఎరుపు, నలుపు, ధూమ్రము, పసుపు, కపిలము, పాండురము అనే వర్ణాలలో ఉంటాయి.

మానవదేహము మలత్రయముతో నిండి ఉన్నది. మలత్రయము అంటే

1. అణవమల 2. మాయీకమల 3. కార్మికమల. మూడు గుణాలు అంటే సత్వరజస్తమో గుణాలు. వీటినే 1. సాత్త్వికము 2. రాజసము 3. తామసము అంటారు. అహింస, పరదార ద్రవ్యములందు అభిలాష లేకుండుట,కోపము లేకుండుట, గురువుకు శుశ్రూష చెయ్యటము, శౌచము (దేహశుద్ధి, మనోశుద్ధి) సంతోషము, ఋజుమార్గము, స్వోత్కర్ష దంభము లేకుండుట, దైవమందు, వేదము నందు నమ్మకము (అస్థిత్వము) ఇతరులకు అపకారము చేయకుండుట, ఇవన్నీ సత్త్వగుణం గలవారి లక్షణాలు.



నేను కర్తను, నేను భోక్తను, నేను వాచాలకుడను, నేను అభిమానం గలవాడను. అనేవి రాజసప్రవృత్తి గలవారి లక్షణాలు.

నిద్ర, సోమరితనము, మోహము, ఆశ, మైథునము, దొంగతనము, తామస ప్రవృత్తిగల వారి లక్షణాలు. తమోగుణానికి ఉండే శక్తిని ఆవరణశక్తి అంటారు. ఈ శక్తివల్లనే ఒకవిధంగా ఉన్నవస్తువు ఇంకొకవిధంగా కనిపిస్తుంది. ఇదే పురుషుని సంసారానికి మూలకారణము. తమోగుణంచేత కప్పబడినవాడు ఎంతటి బుద్ధిమంతుడైనా, విద్వాంసుడైనా, నేర్పరి అయినా, విషయాన్ని సరిగా గ్రహించలేడు. తమోగుణం ఒక రకమైన భ్రమను కలిగిస్తుంది. దానివల్ల తనకు కనిపించినదే నిజం అనుకుంటాడు. తమోగుణానికి నాలుగు రకాల శక్తులున్నాయి. అవి

1. అభావన – పరమాత్మలేడు అనుకోవటం
2. విపరీభావన – నేను శరీరాన్ని అనుకోవటం
3. అసంభావన – పని జరుగుతుందా లేదా అనే అనుమానం
4. విప్రపత్తి – ఉన్నదా ? లేదా ? అవునా ? కాదా ? అనే అనుమానం

తమోగుణ ప్రభావితుడైనవాణ్ణి ఈ శక్తులు వదలవు. తమోగుణ ప్రభావితుడు ఏదీ తెలుసుకోలేక ఒక స్థంభంలాగా కదలిక లేకుండా ఉంటాడు.

సత్త్వగుణం గలవాడు ఊర్ధ్వలోకాలయందు, రజోగుణం గలవాడు భూలోకంలోను, తమోగుణం గలవాడు అథోలోకములోను జన్మిస్తారు. సమ్యక్ జ్ఞానము అనగా బ్రహ్మజ్ఞానము – సాత్వికము, ధర్మజ్ఞానము – రాజసము, అజ్ఞానము – తామసము.

ఇక అవస్థలు నాలుగు అవి

1. జాగ్రదవస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తి 4. తురీయము.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము. ఈ పద్నాలుగింటితో కలిసినది జాగ్రదవస్థ. అంతఃకరణ చతుష్టయముతో కూడినది– స్వప్నావస్థ. ఒక్క చిత్తముతో మాత్రమే కూడినది – సుషుప్తి. జీవునితో మాత్రమే కూడినది – తురీయము.

పాంచభౌతికమైన శరీరం మూడు రకాలుగా ఉంటుంది. అవి

**1. స్థూలదేహము :** చర్మము, మాంసము, రక్తము, నరాలు, మేద, మజ్జ, ఎముకలు మొదలైన వాటితోను, మలమూత్రాలతోను కూడినది స్థూలదేహము. ఇది చాలా అసహ్యకరమైనది. పూర్వజన్మ కర్మల ననుసరించి, పంచభూతాల కలయిక చేత ఈ దేహము ఏర్పడింది. జీవుడు ఈ శరీరంతోనే సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. స్థూలశరీరము ఎప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. మిగిలిన అవస్థలు దానికి తెలియవు. బాల్య, యౌవన, కౌమారాది దశలు, వర్ణాశ్రమ ధర్మాలు, మానావమానాలు, ఈ దేహానికే చెందుతాయి.

**2. సూక్ష్మదేహము :** జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, అంతః కరణ చతుష్టయము, ఇవన్నీ కలిపి సూక్ష్మశరీరము అనబడుతుంది. ఈ సూక్ష్మశరీరాన్నే లింగశరీరము అనికూడా అంటారు. ఇది పంచీకృత భూతాలవల్ల ఏర్పడి, వాసనలతో కూడినదై, కర్మఫలాలు అనుభవిస్తూ ఉంటుంది. స్వప్నాన్ని ఈ సూక్ష్మశరీరమే అనుభవిస్తుంది.

**3. కారణదేహము :** గుణత్రయమే ఆత్మయొక్క కారణ శరీరము. ఇది సుషుప్తావస్థలో ఉంటుంది. సుషుప్తిలో అన్ని రకాలైన జ్ఞానము నశిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో మాత్రమే ఉంటుంది. ఈ స్థితిలో శరీరంలోని అవయవాలన్నీ పూర్తిగా విశ్రమిస్తాయి.

మనస్సు, బుద్ధి, అహంకారము, పంచభూతాలు, ఈ ఎనిమిదింటినీ అష్ట ప్రకృతులు అంటారు. వీటితో జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, తన్మాత్రలు 5 కలిస్తే, వెరసి 23 తత్త్వాలు అనబడతాయి. ఈ 23 తత్త్వాలు కలిగి ఉన్నదే మానవ దేహము. 24వ తత్త్వము అవ్యక్తము. అదే ప్రధానమైనది. ఇదే మాయ. దీనికన్న కూడా వేరైన వాడే పురుషుడు. ధాతువులు మూడు వాతము, పిత్తము శ్లేష్మము. అవి సక్రమంగా ఉంటే దేహము మంచి ఆరోగ్యంగా ఉంటుంది. అవి సక్రమంగా లేకపోతే మానవుడు వ్యాధిగ్రస్తుడవుతాడు. విషయాలను అర్థం చేసుకోలేడు. కాబట్టి పిత్తము అనుకూలంగా ఉన్నప్పుడు చక్కగా గ్రహించగలుగుతాడు. పిత్తము తక్కువగా ఉంటే తక్కువ గ్రహిస్తాడు. అధికంగా ఉంటే ఎక్కువగా



తెలుసుకుంటాడు. పిత్తము వికారము పొంది ఉంటే పిచ్చివాడవుతాడు. పిత్తాగ్ని కర్మాశయమునందు చేరి ధర్మాధర్మములు అనే కారణ వాయువు చేత ప్రజ్వలింపజేయ బడుతున్నది. అప్పుడు దానికి లోపలి అనుభవాలు, బయటి అనుభవాలు కొయ్య ముక్కలలాగా ఉంటాయి.

శరీరంలో జ్ఞానాగ్ని, దర్శనాగ్ని, కోష్ఠాగ్ని అని అగ్ని మూడు రకాల అగ్నులున్నాయి.

1. జ్ఞానాగ్ని మనసులో ఉంటుంది.
2. దర్శనాగ్ని ఇంద్రియాలయందుంటుంది.
3. కోష్ఠాగ్ని దహరమందుంటుంది.

అపానమనే వాయువుతో కలిసి ప్రతిరోజూ భుజించిన పదార్థము జీర్ణమవుతుంది.

నేత్రమే దర్శనాగ్ని ఆ నేత్రము వికారమై ఉండి పదార్థాలను గోచరింపచేస్తుంది. మానవుని హృదయమందు – దక్షిణాగ్ని, ఉదరమందు – గార్హపత్యాగ్ని, ముఖము నందు – ఆహవనీయాగ్ని ఉన్నాయి. అందువల్ల పురుషుడు యజమానిగా ఉండి, బుద్ధిని భార్యగాను, సంతోషాన్ని దీక్షగాను, జ్ఞానేంద్రియాలను యజ్ఞపాత్రలుగా, కర్మేంద్రియాలను పనిముట్లుగా, చేసుకుని యజ్ఞం చేస్తున్నాడు. శారీరక యజ్ఞమందు ఆయాదేవతలే తటస్థమైన ఋత్విక్కులుగా ఉండి, ఆయా స్థానములయందు యజమానునితో గూడా యజ్ఞం చేస్తున్నారు. ఆ యజ్ఞమందు దేహమే ధర్మశాల. శిరఃకపాలమే మోక్షకుండము. కేశములే దర్భలు ముఖమే అంతర్వేది. కామమే ఆజ్యము జీవితకాలమే యజ్ఞకాలము. దహర శబ్దమే సామగానము. వైఖరీ శబ్దమే యజుర్వేదము. పరాపశ్యంతి మధ్యమలు ఋగ్వేదము. క్రూర వాక్యములు అధర్వవేదము యొక్క ఖిల (ఉపాసన) భాగములు. సత్యవాక్కులు వ్యాహృతులు. ఆయుస్సు, బలము, పిత్తము – పశువులు. మరణమే అవభృతస్నానము.

యజ్ఞమందు అగ్నులు ప్రజ్వరిల్లుతున్నాయి. ఇందులో దేవతలు సరియైన సంసార సౌఖ్యము అనుభవిస్తున్నారు. ఈ విషయాలు తెలుసుకున్న వారందరూ యజ్ఞం చేసినవారే అవుతారు. ఇటువంటి యజ్ఞం చెయ్యలేనివాడు జీవించి ఉన్నవాడు

వాడను నేనే. పురాతనుడనునేనే ఈ విశ్వానికి కారకుడను, హిరణ్మయ స్వరూపుడను, కళ్యాణ పురుషుడను నేనే. అవయవాలు లేనివాడను, ఊహకు కూడా అందనిశక్తి స్వరూపుడను, నేనే. కళ్ళు లేకపోయినా చూడగలను. చెవులు లేకపోయినా వినగలను. నేను అద్వితీయుడను. నేను అనంగుడను కాని అందరినీ ఎరుగుదును. నన్ను గుర్తించగలవారు మాత్రం ఎవరూ లేరు. వేదములద్వారా మాత్రమే తెలుసుకోదగిన వాడను. జ్ఞానముద్వారా మాత్రమే పొందదగినవాడను. వేదాంతకర్తను. వేదవేత్తను. నాకు పాపపుణ్యాలు, జనన మరణాలు, ధర్మాధర్మాలు లేవు. దేహము, బుద్ధి, ఇంద్రియాలు లేవు. పంచభూతాలు నాచేతనే నిర్మించబడినాయి. నన్ను తెలుసుకున్న వారు బంధవిముక్తులవుతారు. అని త్రికరణశుద్ధిగా భావించిన సాధకుడు సాయుజ్యం పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

ప్రియశిష్యులారా ! ఇప్పటిదాకా చరాచర జగత్తుయొక్క సృష్టి నుండి ఆత్మ సాక్షాత్కారము, సాయుజ్యముదాకా అనేక విషయాలు వివరించాను.

ఈ విషయాలన్నింటినీ మననం చేసుకుంటూ, అమనస్కయోగం సాధించి జీవన్ముక్తులు కండి. అంటూ శిష్యులిద్దరినీ ఆశీర్వదించాడు రత్నాకరుడు. శిష్యులిద్దరూ గురువుగారు చెప్పిన విషయాలను అతిశ్రద్ధగా విన్నవారై, వారికి ముమ్మారు ప్రదక్షిణ చేసి, సాష్టాంగ దండ ప్రణామాలాచరించి, గురువుగారిని పరిపరివిధాల సత్కరించి శెలవు తీసుకున్నారు.

*హరితసగోత్రీకుడు, శ్రీ క్రోవి పురుషోత్తమశర్మ శ్రీమతి లక్ష్మీనరసమ్మగార్ల*
*పౌత్రుడు, శ్రీ క్రోవి కృష్ణమూర్తి, శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మగార్ల జ్యేష్ఠపుత్రుడు*
***'పరమానందనాథ'*** *దీక్షానామధేయుడు అయిన* ***'క్రోవి పార్థసారథి'***
*సర్వజనామోదము పొందునట్లుగా అత్యంత సులభశైలిలో వ్రాసిన*
***'ఆత్మసాక్షాత్కారము'*** *అను గ్రంథము సమాప్తము*
*ఓం తత్సత్*